

శ్రీరస్తు.

---

## గజేంద్ర మోక్ష దండకము.

---

శ్రీమద్భవానీహృదంభోజ భృంగా లసన్నాకగంగా
ఝురీపూతసారోత్తమాంగా కరాలంకృతాంచత్కురం
గా వృషాటత్తురంగా సులింగా మహాదారుకారణ్యశాం
తాభుజంగా శితాంగా భయంకారఘీనాంకఝూంకా
రవచ్చాపటంకారనాశంకరా శంకరా భక్తమోక్షంక
రా వీరభద్రా హతక్షుద్ర రుద్రా భవద్దివ్యనామాంకి
తంబొప్ప నాభాగవద్గ్రంధమం దుల్లసద్బ్మైరాంచత్కు
లాబ్ధీందుడాపోతరాజప్రణీతాష్టమస్కంధసంధానితాం
చచ్చరిత్రంబు నేబుష్పకాండప్రచండోగ్రఘార్వీరవాఖం
డవాబ్జాండలోద్దండతర జండవేదండశాద్దండకం బౌకరూ
పూదండగా జెప్పి యర్పించెద న్నీకు న్నాత్మవ్పులుల్లంబునం
దొప్పులుంగా గటాక్షించి యాలించవే తత్కథామాధు
రీసాధువాదంబు లెట్లన్న శ్రీపద్మగర్భాండభాండప్రకాం
డంబులన్నింటి రేయొండభంగిం బ్రకాశించు కీర్తిప్రతిష్ఠామ
హాశైబు డంచత్పరీక్షన్మహారాజుతోడం జతుర్వేదవేదాం

తసారాంశసమ్యగ్ఘృతుం డాతుడుం డాదరాయత్త చిత్తం
బుతో ఘోరనక్రగ్రహాగ్రస్త హస్తిప్రభుం దీనరక్షాను
భావుండు శ్రీవాసుదేవుండు తన్నక్ర నిర్వక్రబాధ న్నిరో
ధించి ప్రాణప్రదానంబు గావించెనందున్ వచించంగ విం
చా పరీక్షున్మహారాజ యో మానిచంద్రా మహాభీర ఘో
రాటవిం జాలటప్పాట నీరాటయుగ్మంబు కేచోట బో
రాటమేరూటివాటిల్లె నారాట మేపాటిగాను న్నికాటా
రిచే నీటుగల్పుంబడెన్ మానిలో కేశనాశిక ఫాసారపూరం
బు తోరంబుగా నారమారాటల్కథాకర్ణ నామోదరుం
ధ్రంబులౌ కర్ణరంధ్రంబులన్ సోకగా జెప్పవేయన్న నమ్మా
నివర్యుండనుం గార్యనిర్వార్యతూర్యస్వనాదార్య వాగ్వై
గ్యధుర్యంబుగా నోనృపగ్రామణీ నీవు దత్తావధానుండ
వై యాలకించందగున్ శ్రీవిరాడ్యోగమాయా సుతంద్రం
బునా పాలసంద్రంబులో రంగుబంగారుపొంగారు శృం
గాలచే సంగతంబైన తారావధూటీ లలాటంబు తుంభ
త్త్రికూటంబనే పేర బల్గొండ యొండాయుత ఖ్యాత మా
యోజనాయామమై నంతయేనిన్ వెడల్పై విరాజిల్లు నం
దగ్రరత్నప్రభా భాసిత శ్వేతగాంగేయరంగంబులై మూ
డుశృంగంబులొప్పారు తత్పర్వతంబింక భల్లాతకీమాతు
లాన్రూతకీ చూతవైభీతకీ కేతకీ కుందమందార నచ్చం
దనాశోక ఖర్జూర మల్లీ మధూకోజ్జ్వలన్మాధవీ మాలతీ

తాల తక్కోల హింతాల సాలప్రియాళూల్లస జ్జంబుజం
బీరరంభాకదంబాంబవీగంధ షడ్గ్రంధికా సింధువారా
మ్రాతకర్కంధుబంధూక హింగూ లవంగీ విళంగైలకీ మా
తులుంగత్రుటీ పూగపున్నాగసన్నాగ శాఖీతమాలద్రు
మైరండ భేరుండికాతింత్రిణీ నారికేళాది నానావిధ క్ష్మా
రుహశ్రేణి శాఖానుశాఖోపశాఖల్ వసంతర్తుకాలాను
కూలాభిసౌభాగ్యసంపత్పరాంకూరవారంబులై కాయ
లుంబింబలుం బిండ్లు పూవుల్ చిగుళ్లెల్లజంగళ్లు నేజామ
హారాజరాజద్విభూత్యైక వాసంబికా మాధవారాధ
నాధారకృచ్ఛోభనద్రవ్యముల్ బోలిశోభిల్లు నద్దివ్యశైలం
బు సంస్తవ్యమైనవ్యమై మల్లికావల్లికైలాలతాజాతివల్లీవ
లన్మాన కుంజచ్ఛటారాజమై తేజమై జృంభితాంభోజమై
సంభవద్భీజమై పూజమై వాలుకానేక స్రోతస్వినీ సైక
తాళీప్రవాళీ లతోద్యానకేళీ మిళత్కీరపాళీ పికత్రోటి
కూళీ దళద్దేవతాళీ లసన్నారికేళీ వయస్థారసాళీ మ
ధూకామ్రకోలీఫలాళీ బిలోద్భిద్రసాళీ ఝరీజాలమై సా
లమై శీతవాతూలమై దేవతాఖేలమై కూలమై ధూతభే
తాలమై తాలమై నీలరత్నప్రభాఖర్వ తత్పర్వతాంధీభ
వత్కందరప్రాంత లీలావహద్దేవగంధర్వవిద్యాధరద్వం
ద్వసందోహకృన్మోహనానోన్య సల్లాప సంగీత రంగ
త్ప్రసంగాభిశృంగారమై సారమై నిర్ఝరాగారమై నిక్వాణ

తీరమై కుటీరమై పుష్పరాజీరజఃపూరమై భారమై
తారకాధారకృత్తచ్ఛిరఃపాతసాయాతస్రోతస్వినీజాత
భీతారవా నిర్గళద్దిగ్గజానీక కర్ణద్వయీరంధ్రమై రుంధ్రి
మై శాఖిశాఖాగ్రజాగ్రస్మహాచ్ఛంద్రమై చంద్రమై సూ
న్నతాగేంద్రమై మంద్రమై సాంద్రవద్గండ భేరుండ కంఠీ
రవక్రోడసారంగసాలావృకాద్యుల్లసజ్జంతు సంతానకృ
త్స్వాంతశాంతాన్యోన్యజన్యాగ్ఘటీకంపిత ద్వాదశాత్మా భయో
త్పాదమై మోదమై వల్లకీనాదమై మల్లికామోదమై శ్రీద
మై వైభవాపాదమై మేదురస్వర్ణసోపానసవ్యాగ్రసరస్త్రీ
రవీచిత్సుమామోద బోధావహోద్వాతబోతానుధూతా
జ్జినీ డోలికాకేళికాంచన్మరాళీ వరాళీకరాళాకమై కా
కమై బర్హికృత్కేకమై టిట్టిభోలూకమై కోకమై పండిత
శ్లోకమై భేకభుగ్లోకమై శాకమై కిన్నరాగణ్యపిణ్యాకమై
నాకమై ప్రేక్షణానూకమై వీక నానాజలస్థాన సంచార
కాదంబ కారండ కోయష్టికాద్యంబుపక్షిచ్ఛటా కృత్య
కోలాహలధ్వానదూన త్రుటిత్తారకాబృందమై మంద
మై వీక్షణానందమై కుందమై పుష్పమాకందమై వీంవ్యా
మాకందమై కందమై యందమై యొప్పు నప్పర్వతశ్రేష్ఠ
మందుంగజబృస్తులంగోర్కెఁ జేరొక్కని దంతావళశ్రేణు
లెల్లన్ఱృపిత్సాభయంకారరూపంబులై చీకటుల్ భీతిచేదద్ధ
రాభృద్గుహాంతంబులందుం బవల్ డాగి యాసంజ కర

జోగీకరంజాప్త వృద్ధత్వముం దెల్పగా లేచి తత్కందరాం
తంబులందుండి వేంచేసెనో యన్న భంగిం బిపాసాక
రాయత్త చిత్తంబుతో మత్తకుంభిచ్ఛటల్ దంభజంభారి
గంభీరదంభోళిధారావిహార ప్రకారంబు ధాటి న్నిరా
ఘాటసంచార కేళీవినోదంబుతో దద్గుహాద్వారముల్ దా
టి కోనేటికిన్నీటికిన్ సూటిగా బోవుచుండంగ దద్వారణా
న్యోన్యసత్పాదవిన్యాస దోస్స్పర్శనాశ్లేష ఘీంకార లీ
లావిలాసాదికోలాహలార్భటిచే నన్యసామాన్యవన్యో
ల్లసజ్జంతుసంతానముల్ చింతచే గొంతవిభ్రాంతిచే ఖం
చటంగాళవౌచుండగా కుంభికుంభద్వయీసంభవ ద్దాన
ధారాపరిప్లావోదరాంతంబులై భృంగముల్ మంగళా
నంగసంగీతముల్ పాడగా దత్పదక్షుణ్ణ మోటుత్కటాటో
దరూత్తారుణాట్టో మమాకాశభామాకుచంబుల్ పిధానిం
చగా శస్త్రహస్తాంచలోదస్త విస్తారవిన్యస్త పత్త్రీకృతస్వ
కవిక్షేపమోక్షప్రసూనప్రతానంబులుం దద్వనీదేవతా
నైజపూజావిధిం దెల్పగా లీలకన్యోన్యదంతంబులం టాకు
లాడించుచో బుట్టు టక్టిక్టటాలన్న శబ్దాలకున్ శాకినీ
ఢాకినీభూతభేతాళవ్రాతంబు జేతంబులం భీతి వాటిల్ల
గా నేనుగుల్ వచ్చుచుం బల్లవాఘ్రాణముల్ జేసి మట్టా
డుచున్ భూజముల్ ద్రోయుచున్ లేతదోంపంబులన్ మే
యుచుం గొమ్మలం గోయుచున్ బోతులం గోతులం జేయు

లన్ వ్రేయుచున్ మేల్కొలంకుల్ కళంకంబుగా జేయు
చుం గొండలందుండి గొబ్బిళ్లు గోరాడుచుం దొండముల్
జాపుచుం బువ్వులం జోపుచుం బత్తులన్ లేపుచున్ సింగ
ముల్ దాపుచుం బాణముల్ చాఱుచున్ దానముల్ జేపుచు
న్బద్మముల్ మాపుచున్ బోవుచున్నిల్చుచుం దోటియేనుం
గుకుంగొమ్మలందిచ్చుచున్ మెచ్చుచున్ మెచ్చియందిచ్చు లే
పచ్చికొమ్మల్ మెయింగ్రుచ్చుచున్ వచ్చుయాకుంజరీకోట్ల
లో నాకకుదంతావళేంద్రంబు తాజిక్క 'తృష్ణార్జనా
ధూతమై ముంగలన్వెన్కమధ్యన్ ద్విపార్శ్వంబులన్ వ
చ్చునప్పేర్లమొత్తంబులంగూడి సర్వేశ్వరాయత్తతం జిత్త
ము స్వతంత్రముం గామిచే నొత్తి తానుం గరేణువ్రజంబో
కకామార్గంబునే బోవుచూ బల్వలశ్రేణిలేపచ్చికన్ మచ్చి
కన్మెచ్చి బంతికందిచ్చుచూ గమ్మపూగొమ్మలం గానక
గానిచ్చుచూ శీతకర్ణద్వయీ తాళవృంతంబులం దోటియే
నుంగు మైగ్రమ్మ జెమ్మటల్ జిమ్ముచూ నెమ్మితో గొమ్ములం
గంధరమ్ముల్వడిందువ్వుచూ దొండముందొండము న్పెన్చు
చూ కెన్ని మూరొక్కంచు గ్రీడించుచూ మత్తమాతంగమ
ల్లంబు శోభివినోదాభిసౌభాగ్యుడై యాత్మకుంభద్వయీ
పూర్ణతన్ యానగంభీరతన్ హస్తవిస్తారమున్ దంతవి
క్రాంతకాంతిన్ వయోరూపలావణ్యముం గాంచి యా
హింగలాకాద్రిపర్ణిశితేభాంజనాద్యష్టకాష్ఠేభరా ద్దయి

తలున్ వెంటనే తేర నానామహారణ్యమాద్యద్విపారంబు
తోడం గజేంద్రుండు తామార్గముందప్పి భాస్వత్ప్రభా
పూపరాయత్తచిత్రంబుచే పత్రకుండాళి మొత్తంబులుం
దానుదవ్వేగి యచ్చోట మాందన్మరుత్కంపితాందోళితేం
దీవరాళీరజస్సుం దదాటన్మిళిందాళి ఝంకారపుంజున్మ
హస్సుందటోద్భృత్తమాలైలకీమాలతీప్రస్ఫురల్లీవతత్యం
జరంజత్తమస్సుం దిమీకచ్ఛపీమత్స్యకీ ప్రచ్ఛ్యాఘ్యానచ్ఛ శ్వ
యస్సున్ స్వశేపార్థక్రొత్తుహ్వ మాయాతపస్సున్నద
తోక్రోకహంసాది నీరాండజోద్యచ్ఛిరస్సున్ లసన్మానసా
భ్యాతిరస్సున్ సరస్సున్విలోకించి కించిత్సరోరాజరాజీ
వరాజీవిరాజత్సమీరంబుచే మేను లింపొందగా గోకిలా
కాకలీవాకకలీహంస కూహూకుహూ స్నిస్వనార్భాటిచే
గర్ణముల్ తుళ్ళగా ఫుల్లదిందీవరాంభోరుహామోద వి
స్ఫూర్తిచే నాసికల్ కిట్టుమట్లాడగా నిర్మలోర్మిసరస్సీర
మాధుర్యధుర్యంబుచే జిహ్వలంటుల్పు దుళ్ళించగా శ్రో
జగన్మాత్మసౌభాగ్యసందీప్తమా వైభవస్ఫూర్తిచే గం
డ్లకానందముప్పొంగగా దాముపంచేంద్రియోద్యోగముం
దుంబరామోషమై దంతిసంతానముల్ తత్సరోరత్న
ముం జొచ్చి తొండంబులన్నీరుబూరించి గండంబులం జల్లు
కొంచున్ గళధ్వానముల్ మెండుగా గొబ్బునన్ భూరిం
ధాండంబులన్నిండ నాకండవేదండముల్ నీరు ద్రావంగ

రేణుప్రభుండప్పుడున్ హస్తరంధ్రంబుల న్నీర మెక్కించి
పూరించి పూత్కారతారంబుగా జైక జిమ్మంగ దన్నీర
ధారాభిషేకంబుచే దత్కరీపాద సంఘాత ఘాతావనీ
జాతధూళీ విళన్నాకపంకంబు బోచుండగా ఘుగ్గుఘు
గ్ఘుఘుగధ్వాన ఫేనోల్లసద్భంగముల్ నింగి కుప్పొంగగా
నుం భయంకారహుంకారపూత్కార నీరార వార్భాటి
చే ఘోరనక్రగ్రహాకోటి భీతిల్లగా వాలవిక్షేపదుర్వా
ర జంఝూసమీరంబుచే ఘుమ్మ ఘుంఘుం ఘుమావర్త
ఘుష్పారగాధంగసంఘట్టనాపత్తటీవృక్షముల్ వేళ్ళతో
భూమిపై గూలగా గచ్ఛపీమత్స్య మండూకాండజ వ్రాత
ముల్ గిందుమీదౌచు బ్రాణావశిష్టంబులై యుండగా వా
రణేంద్రుండు నిర్వారణుండై జలస్నానకేళిన్ వినోదించు
చుండంగ దత్కాలమందా సరోరత్నమందుండి వీక్షిం
చి రోషించి కుప్పించి లంఘించి తా హుంకరించన్ బై
మార్తాండబింబంబునం బట్టు రాహుగ్రహంబట్లు గా
శింతుమారగ్రహంబొక్కటా నాగలోకేంద్రునిం బట్టె
నప్పట్టునం దంతిరాజట్టె తొండంబు బిట్టెత్తి కొట్టంగ
నాకొట్టుతో నాళవాలంబుకున్ మట్టి తన్నుక్రమున్ నక్ర
మక్రీడ వేళోదనే వాగరాట్పూర్వపాదద్వయిం బట్టగా
నవ్యాడవ్యోగ్ర శేడాయ్యనన్ దంతకుంతాంత సంఘట్ట
నన్నక్రశల్కల్ మేని విస్ఫులింగ దిందూలచెంజిమ్మగా రింతుమా

రంబునవ్యోన్యతోండంబమూలంబుగా గోరులంజీరెని
ట్లాగజానీక రాట్శింశుమారంబులున్ రెండు నొండొం
డనుద్దండచండంబులైడాకి లోకేక్షణాంభోజరా ద్రా
హులై దుర్మదోత్సాహశ్రద్ధేహులై సంతతాన్యోన్య
సంయుజ్జయశ్రీమహామోహులై క్షోభితాంచత్సరఃపం
కరుద్ధాహులై తాడనాపీడనారోహులై స్వేదసందో
హులై సింహమున్ సింహముం గొండయుం గొండ
యుం దాకి బెర్సింబెనం గేటిలీలద్దులేనట్టి పోరాటముం
బెట్టుచూ లోనికిన్వెలికిం బోచూ గొలంకుం గలంకంబు
గా గల్చుచూ బుస్సుత్కారమాచున్ఫుగుల్లన్న చప్పుళ్ల
తో నుర్వులం గట్టుచూ నీరపూరం దారకా మండలంబంట
పూత్కారముల్ జేయుచూ జండశుండాప్రకాండంబులం
దుండఖాండంబులన్ వ్రేయుచూ సంతతైకాంతకృద్దంత
కుంతంబులం బన్నిచిప్పల్ కుదుళ్లూడి రక్తంబులుం గ్రి
మ్మనోకుక్ష్మిడిం జిమ్ముచూ ఘోర పారస్పరాకర్షణం
బుల్ బదంబుల్ మొదల్పట్టులన్వీడకన్ గట్టిగా బట్టుచూ
విభ్రమచ్చారవేగంబున న్నీటిలో మాటికిన్మాటికిం దూ
టుచూ మీటుచూ దాటుచూ గందమందూక గందూప
దీకచ్ఛపాద్యంబుచారంబులుం దాము జీవావశిష్టంబు
లై యుండునొండొంటితో దాకగా ద్రొక్కుచూ గుల్ల
లంటిప్పలన్నాటుచండంబులన్యోన్య సంతాడనశ్రేణి క

డ్డంబుగానొడ్డుచూ రిమ్మి పల్గొమ్ములన్ గొమ్ములంగుమ్ము
చూ జిమ్ముచూ వెన్నులుంజన్నులుంగన్నులున్ పన్నురోం
పిన్విలేపించుచూ మేలికీల్సంధులన్ వ్రేయుచూ గూయు
చూ మేనుమేనంటగా రాయుచూ బాయుచూ డాయు
చూ మోహపాశంబులంగోయుచూ దోయుచూ గల్ప
తల్పుల్బయల్గొల్పుచూ సల్పుచూ దొంతముల్ మల్పు
చూ నిల్పుచూ నీరముంగల్పుచూ నాగరాణ్ణక్రముల్ రెం
డహూరాత్రముల్బోలె సంతెంతకున్ వింతగా జృంభ
మాణంబులై జాలకాలంబు సంగ్రామభీమంబులై నిర్గ
తాహారనిద్రాశలై దారుణావక్రసద్వక్రనక్రేడలై బోరు
ఘోరంబుగా జేయుచున్నంత నానీరచాగంబుతో బోరు
సారంగరాజోక్కనిం డించి పోగాల్గురాకన్ విచారాస్థి
కగ్రస్తులై హస్తినీయూధముల్గోరి వీక్షించుచుండెన్ మ
రింజీవనంబేదనోకస్సుయుం జీవనాధారమౌటం జలం
బుంబలంబుం బయశ్చారికంతంతకున్ హెచ్చి తా శుక్ల
పక్షాంతనక్షత్రరాడ్బంగిగానొప్పె సిద్ధాబలాహారము
ల్లేక దంతీశుడంతంతకుండస్సి తార్క్ష్యపక్షాంత తారా
పతింబోలిశోభిల్లె నిట్లాకరీంద్రుండు శోషించుటన్నీచచా
రంబు జృంభించి కంభీశ కంభీరకంభద్వయున్ సింహ
ముంబోలిలంఘించుబాదంబులంబట్టి చిట్టాడు గంతంబు
జేరున్ వశించన్నువెన్నాడు దాయుస్సముచున్ హాటా

యించిదాటుంధరంగూలశల్యంబులందంతముల్ వ్రేయు
బాంచుండి హత్తుంబాడంగ నరాకుంచు డాగున్వడిన్ వె
లిగ్బోవంగ దానడ్డమై యొడ్డిగా నంబడున్ మాటికిన్ దా
టు లేచున్ మిటారించి బోరాక రారాక గాల్లం బెనం
గున్ దొలంగున్ మలంగున్ జెలంగున్ మెయింజీరు వేధించు
గ్రోధించు నిట్లా వినిష్వక్రప్రున్ విక్రమంబైన నక్రంబుచే
గ్రాంతమైనట్టి పాదాలు వీడించుకోలేక సందేహముం
బొందు దేహక్రియన్ దీనహృత్తుల్యమైనిర్మదామూల్యమై
యుద్ధసాకల్యమై కల్యమై భీషణగ్రాహ దంతాంతఘా
తావశిష్టీభవచ్ఛల్యమై శత్రుసంహార వైకల్యమై యేన్గు
రేడాపయశ్చారతోడన్ దివంబుల్నిశల్ సంధ్యలన్ గోక్కు
తో వేయిసంవత్సరంబుల్ మహామత్తతన్ బోరుఘోరంబు
గా జేసి యాత్మీయశక్తి న్బయశ్చారిశక్తి న్విచారించి మి
థ్యామనోవాంఛలింకేటికిన్ దీనిగెల్వన్ సరింబోరగా జా
లవాదందు దాబూర్వపుణ్యాగతజ్ఞానసంపత్తితో నిట్ల
నుందీని నేరీతిగా గెల్తు నేనింక నీమీద నే దేవునింగొల్తు నె
వ్వారలం బిల్తు నింకెవ్వరడ్డంబు నివ్వారిచారంబు వారించ
గాదగ్గవారెవ్వరే దిక్కు లేనట్టి యీనా మొరాలింప బు
ణ్యాత్ముల్ విక్కులే కేమదిన్ మ్రొక్కెదన్ దైవమా యే
మి నానాగజంబుల్వనశ్రేణిలో బెద్దకాలంబు నన్నారవిం
పన్ ద్వపంచోల్లసల్లతకోటీకరింద్రుండనై యుండి మ

ద్దానధారా పయఃపూర మందార సచ్ఛందనాంచత్సు
మచ్ఛాయలం దండగాలేక నేదేహదోహంబులై దా
హమోహంబుచేదప్పి నీరాశికై ల్లైల నేవచ్చితిన్ వచ్చి
యీశింశుమారంబుచే జిక్కి తింకెవ్వరిం దూరు దే
వ్వానిచే నీజగంబుల్ జనించు న్వశించు న్నశించు న్బర
బ్రహ్మ మెవ్వాఁడు లోకేశులున్ లోకముల్ సర్వ లోకస్థు
లుం డిందు వెనక్కుంద లోకాంధకారంబుకుం బైన నె
వ్వాఁడు మేకాకృతి న్వెల్గు దా నాదిమధ్యాంతముల్
బొంద కేకాకియై పీఠకాద్యంబుచుఁడ్యోని పర్యంతమున్
బ్రాణికోట్లందు జీవేశ్వరత్వంబుచే నైక్య భావంబు
బొందేటివా డెవ్వఁ డష్టాంగ యోగీశ్వర ధ్యానకృ ద్దేవ
తాకారుఁ డెవ్వాఁ డవిద్యాజనాసాధ్యమౌ బ్రహ్మవిద్యాగ
మోద్యోగ సంవేద్య విద్యుత్సుషుమ్నాకడంభాయుతాం
చత్సహస్రారపద్మంబునన్ హంసరూపంబుచే నెవ్వఁడా
డున్ మునీంద్రుల్ సురల్ దేవతాయోను లెవ్వానికీర్తింప
గానేర రెవ్వాఁడు శైలూషిభంగిన్ విశేషానువేషాలతో
నాడు సంసారముం గర్మము న్నామముం దాపముం గో
పమున్ రూపమెవ్వానికిన్ లేక నాత్మీయ మాయావిశేషం
బుచే లోకముల్ బుట్టగిట్టింప నిన్నింటనిండాల్చు నెవ్వాని
దీజంగమస్థావరాంతర్బహిర్వ్యాపకంబైన తేజంబు మో
హంకరుం డెవ్వ డోంకారగేహంబుకుం దీపికాకారు డె

వ్వండు బ్రహ్మర్షి దేవర్షి రాజర్షి మర్త్యాదు లెల్లం దప స్స్వాత్రి సత్రాదు లెవ్వాని సంతృప్తిం జేయు నిర్ముక్త ధ ర్మార్థకామేచ్ఛులై సాధు లెవ్వాని సేవించి యిష్టంబు జే కొందు రెవ్వాడు తన్మూర్తిగాంక్షించునట్టుత్తమ శ్రేణికు ద్యద్దయాపూర్ణుడై సావ్యయాంగంబు నిచ్చు స్స్వయం శ్రా త్ము లెవ్వాని సేవింతు రానందసింధూపమగ్నాంతరంగుల్ సద్భైకాంతు లెవ్వాని దామేమియుం గోరకం దచ్చరిత్రం బు గీర్తింతు రెవ్వాడు సర్వేంద్రియద్రష్ట సర్వంబు నవండీజ గచ్ఛిల్పనాకారణుం డెవ్వ డధ్యాత్మయోగానుగమ్యుం డశేషాంత వేదాంత ముద్యచ్చతుర్వేద వేదాంగముల్ సర్వశాస్త్రంబు లెవ్వాని తత్త్వప్రభావంబు బోధించు నె వ్వాడు వాఙ్మానసాతీతు డెవ్వండు శుద్ధాత్ము డేగాక నే త్రిద్వయాగోచరుం డెవ్వడవ్యక్తుడున్ వ్యక్తుడున్నిర్గుణుం డుం గుణుండుం గుణాతీతు డెవ్వాడసాధ్యుం డవేద్యుం డనాద్యుం డనంతుం డవాచ్యుం డఖిన్నుండు సద్యఃప్ర సన్నుండు యెవ్వాడు పుంస్త్రీనపుంభావుడుంగాక దిర్య ఙ్మనుష్యామృతాంధోముఖాకారియుంగాక గర్మప్రకం సాగుణస్థాన వైకల్య దుస్సత్ప్రకాశుండుగాకం బరా ర్థంబు దర్వాత నియ్యన్నియుం దానగుం జేతనాచేత నాంతత్ప్రపంచస్వరూపుండు మాయామయుం డెవ్వడా పంచభూతేశు డెవ్వాడు సర్వేశుడున్ సర్వరూపంబు లె

వ్యాపిరూపంబు శక్తిప్రదుండెవ్వ డేదికుఁ లేనట్టి నా
బోట్లకుం దిక్కు యెవ్వాడు సర్వప్రపంచంబులందున్న
ప్రాణీసమూహంబులం బ్రోచువా డెవ్వడో యట్టి స
ర్వాంతరాత్ముండు యీశింతుమారో గ్రబాధన్నిరోధించి
నన్నుం దయంబ్రోవుగాకంచు నెంతేమొరంబెట్టినా రే
మిలేకుండుటం జేసి దంతీశుడత్యంతవిశ్రాంత చింతాభర
భ్రాంతస్వాంతుఁ బనంతాత్మ పాదద్వయాక్రాంతముం జే
సి తానిట్లనంగా ద్రాణంగెన్ విలోలంబు మెం ప్రాణముల్
తావులందప్పె లావింతయున్ లేదు ధైర్యంబు మూర్ఛా
గతంబయ్యె డస్సెన్ శరీరంబు చాలాశ్రమంబయ్యె దీన్నీ
వుదప్పన్యులన్నే నెఱుంగం దయాసింధురావే ననుం గావ
వేదీనునిం గారవించందగుం దావకార్తీయ దాసానుదా
సుండ నిన్నమ్మినాడం ద్వదీయానుకంపా ప్రసాదానుపా
త్రుండ సర్వేశ్వరా నీవు వింటావటే భక్తవాక్యాలు పో
తావటే నీవు బోరానిచోటుల్ నినున్ రక్షణార్థుల్ వడిం
బిల్చుచో వోయియుంటావటే సేవకాభీష్టకష్టంబులన్నీవు
గంటావటే నాకుసందేహమయ్యెం దయాంభోనిధీ యా
ర్తరక్షా జగన్నాయకా భక్తవాంఛానుసంధాయకా
సాధులోకాటవీచైత్ర మోపద్మనేత్రా పవిత్రా మని
స్తోత్ర యోదీనమందార రావే దయంజూడవే రక్షణార్థి
న్ననుంగావవేయంచు దాబల్కి నన్నుం జగద్రక్షకుం డీ

ళ్పుడాపన్నుడై బోరుమగాశంచు దా నింగికిన్నిక్కి వీక్షిం చుచూ వేడినిట్టూర్పులం బుచ్చుచూ నగ్గజేంద్రుండు గోల్పెట్టుచుండంగ నామొఱ్ఱవించద్ద మెవ్వారలున్ రాక బ్రిహ్మాదులెల్లూరకేయుండి రంతన్ ముకుందాంఘ్రిదాసోపకంఠంబు భాస్వద్వికుంఠంబులో నాకమూలన్ వరోద్యానవాటీనటత్కుందమందార జాతీలతాజాత పుష్పాసవక్లిన్నభూప్రాంతమం దుల్లసద్వజ్రవైడూర్యయూథంబు సౌధంబులో మల్లికా పారిజాతాది పుష్పవ్రజానల్ప శిల్ప ప్రికల్పంబు తల్పంబు మీదన్ రమాదేవి లీలావిలాసాభివర్ధిష్ణు డావిష్ణు డానాగలోకేంద్ర విజ్ఞాపితానేక దీనానులాపంబు లాలించి లక్ష్మీప్రకేళీ వినోదంబులం దన్వి చాలించి మోదించి సల్లిక్కులం జూచి సద్భక్తిసంయుక్త దంతీంద్ర రక్షాపరత్వంబు నంగీకరిం చంతటాత్మీయమహా యోగపట్టంబు జేబట్టి యాకాశమార్గంబుకున్ వేగ వానుద్గమించంత వేంచేయుచున్నప్పుడాలచ్చి తన్వెంటరా నామెవెన్కందదంతఃపురీనర్తకుల్ వారివెన్క స్విహంగేంద్రుడున్ వానిపొంతన్ ధనుఃఖడ్గకౌమోదకీ శంఖచక్రంబులు న్నారదుండున్ మొదల్గాగ వైకుంఠపట్నంబు నందున్నవారందరాబాలగోపాలముల్వచ్చిరా సుందరాస్యారవిందానుసంధానితస్వేదమంద స్మరందవ్రజానంద వత్కుంతలేందిందిరయ్యిందిరాదేవి గోవిందహస్తారవిం

దంబు చేబట్టుకో బద్ధ కర్పూర గంధ ప్రభా భాగురో జాంత
విక్రాంత హైరాపట ప్రాంతమై బోవుచూ నంతరంగంబు
నందానువేంచేయు మార్గంబు చేర్కొడ నాథాంగనాలా
పముల్ వీనులాలించెనో దొంగలా సాధు వేధన్నిరోధించి
వేదంబులందోచిరో దానవుల్ దేవలోకంబుపై రేగి దండె
త్తిరో దుర్జనుల్ భక్తులం జూచి వక్రాయుధుండేడి చూ
పించుడంచుం దిరస్కారము ల్జేసిరో యంచు లోన న్విత
ర్కించి యాశంక నిశ్శంక జేయన్ మది న్జంకి యా పంకజా
గార తా నీల మేఘంబులోనన్ జిగల్ వీలు విద్యుల్లతాలీల
నాబాల గోపాలు వెన్వెంట బోచుండె నంతన్నభః పద్ధతిన్
దానవానీక జిష్ణుండు విష్ణుండు వేంచేయుటం జూచి బృం
దారకస్తోమము వ్వ్యోన్న మీకీర్తిగా బల్కరే తెంచె నారాయ
ణుండల్ల వాడే జగన్నాథుడెంతెన్ రమాదేవినిం గంటిరే
శంఖ వాదంబదే ఘోర విద్వేషణ ప్రాణ వక్రంబు చక్రంబదే
బన్నగ ధ్వంసి యాన్వాడె నేతెంచెనంచు న్సురానీకముల్
మస్తకస్థాన విన్యస్త హస్తాబ్జులై భక్తి తోడన్నమః పా
హి నారాయణా యేతిని స్వానులై మ్రొక్కి రా హస్తినా
ధవ్య ధావక్రికిం జక్రికిన్ మింట నవ్వేళ నవ్వాసుదేవుండు
సారంగ రాట్పాలనా పారవశ్యంబునన్ దేవతాంచన్నమ
స్కార వారంబులీక్షింపకన్ దామనో వేగ సంచారుడై పో
యిపోయంతటం గొంతదూరంబునన్ శింశుమారేశ రా

ద్ద్వంద్వసంగ్రామకేళీ శ్రియానంతరాకీర్ణ జీర్ణాంబరాం
భః ప్రకామ న్నిజస్థానరింఖత్కుచద్వంద్వచక్రాభిరామన్
విలోల ద్వళీభంగభీమన్ విటుంఠ త్కటీసైకతాభోగ సీ
మన్ సమాకీర్ణ ధమ్మిల్ల శైవాల తేమన్ సముద్ధూత దృగ్వా
రకల్హారధామన్ సమాందోళితగ్రీవ శంఖాభిరామన్ వి
వస్త్రప్రవేష్టామ్యణాళీ లలామన్ విధూతాస్య పద్మాభిరా
మన్ సుకాసారభామన్ విలోకించి దుష్టాత్మక ప్రాణి
రేఖావియోగంబు చక్రప్రయోగంబు గావించగా జక్ర
మున్ విస్ఫులింగచ్ఛటావర్తి తాంచన్నభశ్చక్రమై కుంభ
కుంభద్గుభేలన్న శబ్దంబుతోడం గొలంకుం గలంకంబుగా
గల్పుచుం జొచ్చి దుర్వారదృగ్భీకరిన్ మాకరిం డాశి కుం
భీంద్ర శుంభత్ప్రదాకర్ష ణాసక్త మున్ శీర్షముం ద్రుంచి
ప్రాణంబులంబాపె నంతం గజేంద్రుండు మేఘచ్ఛవింబా
సి తీంద్రించు చేరాజుభంగిం బ్రదర్పించి సంసారదుఃఖంబు
వీడొన్న చందత్విరక్తాత్మచందంబుగా నీరచారంబు ప
ట్టూడ్చి పాదంబులల్లార్చి బృందారకత్వంబుతోడం దశా
శావకాహస్తనిర్యత్సుధాంభఃకణ స్నానవిశ్రాంతుడై
యొప్పె నప్పద్మసద్మాధిపుండప్పుడప్పాంగిసన్నాన్యజన్యా
ఖిఘూర్ణన్య రాజన్య సైన్యాత్మ సైన్యంబయా పాంచజ
న్యంబు నాచండదిఙ్మండలోద్దండ వేదండరాట్కర్ణఘూ
ర్ణాయమానంబుగా నోటబూర్ణించె నాదేవతా ఘూర

భేరీలు ధంధంధణత్కారనాదంబులై మ్రోసె సౌగంధి
కాకుందమందార గంధంబులై మందవాతానుపాతంబు
లున్ వీచె భూమిం బువ్వుల్వాన వర్షించె సద్గానమానంబు
లై యక్షదేవాంగనాలాస్యముల్ బర్వె నల్దిక్కులందుం
జయధ్వానముల్ నిండె రంగత్తరంగానుషంగాభ్రగం
గాఝరీచంద్రమై సంద్రముప్పొంగె నంతం జెయింబట్టి
యయ్యిందిరాధీశు డాసింధురాధీశునిం డా గొలంకందు
నం దీసి తత్కుంభసంభూత దానాంబువుల్ ద్రోయు
చూ దేహమున్ రాయుచూ దుఃఖమంతంత బోజేసె న
ద్దానవారాతి దోస్స్పర్శనావాప్తిచే దేహ దాహంబు
బోయా గజేంద్రుండు తోచేనికల్గూడి ఘీంకారనాదాల
తోనొప్పె నోహూపరీక్షిన్నరేంద్రా మునీంద్రుండుయా
దేవలాఖ్యామహాశాపనిర్ముక్తుడై శింశుమారాకృతిన్ వీడి
గంధర్వుడైనట్టి హూహూసమాఖ్యుండు తాదొంటివాడై
దాల్చి సద్భక్తితో భక్తవాంఛాప్రదాయింభుజంగేంద్ర
శాయింబ్రకీర్తించి జోహారులాస్థన్ సహస్రంబు లర్పించి
యా దేవకారుణ్యముంబొంది యుందండ నమ్రోత్తమాం
గంబుతో శాపనిర్ముక్తుడై యాత్మలోకంబుకుంబోయె గో
విందసంపర్శనస్ఫూర్తిచే ధేనుకాధీశుడజ్ఞానసంత్యక్తుడై
యావిరాడూప్రదాదం బ్రకాశించె రాజేంద్ర యాశిం
శుమారంబుతో బోరినట్టాగజేంద్రుండు పూర్వంబు తా

ద్రావిడాధీశు డింద్రద్యుమ్నాఖ్యుండు పుణ్యాత్ముడున్ వై
ష్ణవాగ్రేసరుం డొక్కనా డొక్క శైలాగ్రభాగంబునన్
వీరనారాయణుం బూజగావించి తా మౌననిష్ఠాగరిష్ఠా
త్ముడై యున్నచో మౌనివర్యుండగస్త్యుండు యచ్చోటికిన్వ
చ్చి పెంపెచ్చగా లేవకుండన్ను బూజింపకున్నట్టి యా
ద్రావిడక్ష్మాపతిన్ మూఢబుద్ధీ కరేణుప్రయోనిస్థలిం బా
ట్టుమంచున్ మహాకోపదీప్తాత్ముడై శాపమిచ్చెం బరీక్షిన్మ
హీపాల యట్లాగస్త్యుం డిరస్కారముం జేసిన ద్రా
విడేశుండు తాగుంజరీయోని యందుద్భవంబంది పద్మాస
హస్రీలకున్ భర్తయయ్యెన్ మరిందద్భటాదుల్ కరిగ్రా
తమయ్యెన్ ధరం గాన బుణ్యాత్ముకుల్ విప్రులం గాంచి
యొక్కప్పుడైనం బరీభావముం జేయరాదో పరీక్షిన్మహా
రాజ యగ్గాహుకా విష్ణుపాదాబ్జ సేవాతిరేకంబునన్ దివ్య
లోకంబు నంతబునం గన్గె దర్వాత విష్ణుండు యవ్వైష్ణవీ
రత్నమైనట్టి పద్మాలయన్ హాససందీప సంలాపపూర్వం
బుగానుం బరిష్వంగముం జేసి లాలించుచూ దేవగంధర్వ
సిద్ధాప్సరః కిన్నర స్తోమ జేగీయమానంబుగా దందశూ
కాంతకారూఢుడై యాత్మ గేహంబుకుం బోయెనంచున్
వచించాశుకుం డిట్లనెన్ ధారుణీనాయకా నీకు నాచేత
వాక్రువ్వబడ్డట్టి యీవాసుదేవానుభావంబునా నాగ
రాణ్మోక్షణాంచత్కథాసారముం బాండర ద్వీపముం

కాలసంద్యంబు హేమాద్రి తత్కందరారణ్యముల్ బ్రహ్మ
యున్ శంభుదేవున్ వసించేటి శైలాగ్రముల్ కౌస్తుభో
ద్దామకౌమోదకీఖడ్గసౌదర్శనీ పాంచజన్యంబులున్ శ్రీస
తిన్ శేష ప్రహ్లాద ఫణారిభిద్వాసుకీ నారదాద్యృషులన్
మత్స్యకూర్మోగ్రి భూదార ముఖ్యావతారంబులం ద
ద్భువత్కృత్యముల్ సోమసూర్యాగ్నులోంకారమున్ ధ
ర్మసమ్యక్ప్రకీర్తముల్ వేదవేదాంగముల్ శాస్త్రముల్
విప్రగోసాధు సాధ్వీజనంబుల్ విఘాట్కృష్ణకాళిందిసార
స్వతీ గౌరి గంగా సునందాది పుణ్యాపగావాగముల్ గ
శ్యపాది ప్రజాపత్యుల న్నిర్జరస్తోమముం గల్పవృక్షంబు
నైరావతంబున్ సుధన్ మానసక్షేత్రకన్ ధ్రువన్ దేవబ్రహ్మ
ర్షి సందోహముం బుణ్యమానుష్యుల న్నిష్కళంకాత్ములై
భక్తితో నర్ధగాత్రంబునన్ లేచి యెవ్వారు కీర్తింతురో
యవ్వి కీర్తించగా విందురో వారికిం గీర్తి లెచ్చున్ విప
ద్దుఃఖముల్లేవు దుస్స్వప్నముల్ రావు పాపావళుల్బోవు
భాగ్యావళిన్నైవు సౌఖ్యంబు సిద్ధించు పీడల్ప్రశాంతించు
వర్ధిల్లు సంశోభనంబుల్ పరంధాత్మ పాణీగతంబౌను యె
వ్వారు నిత్యంబు దాదంతురో వారి కాత్మీయప్రాణావ
సానంబున న్నాదులోకంబు కైచేతునంచున్ ముకుం
దుండు నిష్కర్షగా బల్కి రింఖద్రిపుస్వాంత ప్రేంఖంబు
శంఖంబు బూరించి శేషాంతకారూఢుడై మించి వేంచేసె

చంచద్బుధానీకముల్ జాలతోషించెనంచున్ వచించాశు
కుం డప్పరీక్షిత్క్షమాజానితో నిట్లనెన్ మన్మథాబ్దంబునం
జ్యేష్ఠమాసోల్లస చ్ఛుక్లపక్షంబులో మాతులుండైన చా
ట్రాతిహన్మంతురావ్ పంతులాజ్ఞాప్రకారంబు నందూరి
వంశాంబుధీచంద్రమ ద్భావనార్య ద్వితీయాత్మజుండైన
గోపాలమూర్త్యాఖ్యు డాచంద్ర తారార్కముం గాగ
దా జెప్పినట్టీగజేంద్రవ్యథా మోక్షణాఖ్యానముర్విం బఠిం
చేటివారల్ శుభైశ్వర్యదీర్ఘాయురారోగ్య సత్పుత్ర పౌ
త్రాభివర్ధిష్ణులై విష్ణుసాయుజ్య మంతంబునన్ వారుబొం
దంగబోనంచు నవ్వ్యాసపుత్రుండు వాక్రువ్వగా నప్పరీ
క్షిత్తుడానంద సంధానితస్వాంతుడయ్యెన్ సుమా సాంబ
మూర్తి త్రిలోకప్రవర్తి మహాంతేజయం తేశుభం తేసదా
స్తు స్తవంతే మహద్గండ భేరుండఖండేశ చండప్రచండా
యతుభ్యంనమస్తే నమస్తే నమస్తే నమః॥

ఉ॥ చంద్రకిరీటిపేర మృదు చాతురిబాతరలాడ గా
థదం। తీంద్రునిదండకంబు రచియించితినించుక సంస్కృ
తాంధ్రవా। క్సాంద్రరసజ్ఞులైన కవిసత్తములార పరీక్ష
జేయుడా। త్మేంద్రియజాడ్యజాగసుల దిద్ది మదీయ కవిత్వ
తత్వమున్॥

సంపూర్ణము.

